# చీకటిలో చిరుదీ

( నాటిక )

రచన:

యప్పేరావ్



శ్రీ రామా బుక్ డిపో

పబ్లిషర్స్ • బుక్‌సెల్లర్స్

[illegible] గవర్నరుపేట • విజయవాడ-2

— ఫిబ్రవరి



వెల : 2-50

ఈ నాటికలోని పాత్రలు, సన్నివేశాలు కేవలం కల్పితాలు.
నిజ జీవితంలో ఎవరినీ ఉద్దేశించి రాసినవి కావు.

సంపాదకులు :
యు. రాజేంద్రప్రసాద్

ముఖచిత్రం :
బాలి



రచయిత చిరునామా :
ఎస్. ఎ. రావ్
ఎకౌంటెంటు
సెంట్రల్ టెలిగ్రాఫ్ ఆఫీస్,
విశాఖపట్టణం – 530 001.

ముద్రణ :
శ్రీ 'వెంకట రమణ'
విజయవాడ - 2.

## అంకితం

నన్ను కనీ, పెంచీ, విద్యాబుద్ధులు చెప్పించి
నా జీవితానికి ఓ అర్థాన్ని కలిగించిన

నా తల్లిదండ్రులకు
భక్తిగౌరవాలతో

— రచయిత

# కృ త జ్ఞ త లు

నాచేత యీ నాటిక రాయించి, శతధా ప్రేక్షకుల, శ్రోతల ప్రశంసలు పొందేలా యీ నాటికకు ఓ రూపాన్ని కల్పించి నాటకరంగంలో మరో అడుగు ముందుకి వెళ్ళడానికి కారకులైన మా గురువుగారు శ్రీచాట్ల శ్రీరాములుకి,

రైతు జనోత్సవ రజతోత్సవ సందర్భంగా అనకాపల్లిలో యీ నాటికను ప్రదర్శించడానికి, ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రంనుండి ప్రసారం కావడానికి వీలు కలిగించిన ఫారం రేడియో ఆఫీసరు శ్రీ వై. జి. రెడ్డిగారికి.

నాటకరంగంలో నేను ముందడుగు వేయడానికి ఎప్పటి కప్పుడు నన్ను ప్రోత్సహిస్తూ, నా అభివృద్ధిని కాంక్షించే— డా॥ శ్రీ కొర్రపాటి గంగాధరరావుగారికి శ్రీఅత్తిలి కృష్ణా రావుగారికి, మిత్రులు శ్రీకొసనాకి, శ్రీరాజ్ కి, బాబుకి, యీ నాటికలోపాల్గొన్న కళాకారులందరికీ నిండుమనసుతో కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాను.

— రచయిత

తొలిసారిగా ఈ నాటికను "రైతు జనోత్సవ రజతోత్సవము మరియు ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రం వ్యవసాయ ప్రసార విభాగ ద్వితీయ వార్షికోత్సవము" సందర్భంగా 21-1-79న అనకాపల్లిలో ప్రదర్శించినప్పుడు

ఆకాశవాణి విశాఖపట్నం కేంద్రం వారు 11-3-79 ఆదివారంనాడు ప్రసారం చేసినప్పుడు పాల్గొన్న

శ్రీ నవ్యనాటకాయతనం (విశాఖపట్టణం) సభ్యులు:-

| | |
|---|---|
| రాజయ్య | శ్రీ ఎ. వి. రామారావు |
| సోములు | శ్రీ చాట్ల శ్రీరాములు |
| సత్య | కుమారి సి. రాణి |
| కృష్ణారావు | శ్రీ టి. కామేశ్వరరావు |
| కనకయ్య | శ్రీ ఎ. శేషసాయిశాస్త్రి |
| పార్వతీశం | శ్రీ ఎ. గోపాలకృష్ణ |

ఆహార్యం : శ్రీ ఎన్. రంగరాజు

దర్శకత్వం : శ్రీ చాట్ల శ్రీరాములు

సమర్పణ : శ్రీ వై. బి. రెడ్డి (ఫారం రేడియో ఆఫీసరు
ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్ర

ఈ నాటికలో....

రాజయ్య

సోములు

సత్య

కృష్ణారావు

కనకయ్య

పార్వతీశం

# చీకటిలో చిరుదీపం (నాటిక)

(ఒకానొక పల్లెటూర్లో మునసబు రాజయ్య ఇల్లు. వీధి గుమ్మానికి దగ్గరగా వున్న ఆ ముందుగదిలో కుడివైపుకి ఓ వేతుం కుర్చీ, ఆ పక్కనే ఒక స్టూలు వున్నాయి. స్టూలుమీద రాగి చెంబుతో మంచినీళ్ళు వున్నాయి. ఎడమవైపున రెండు పాత కుర్చీలు, వాటికి ఎదురుగా టీపాయ్ ఆకారంలో వున్న ఓ చిన్న బల్ల వున్నాయి. ఆ గదికి ఎడమభాగాన వున్న ద్వారం వీధిలోకి, కుడిభాగాన వున్న ద్వారం పెరట్లోకి దారితీస్తాయి. మధ్య ద్వారానికి వెనుక పడకగది, వగైరా గదులు వున్నాయి. మధ్య గది గుమ్మానికిపైన గోడకి దుమ్ము పట్టిన గాంధీగారి ఫోటో ఒకటి వుంది. ఎడమవైపు గోడకి పరమేశ్వరుడి కేలెండరు, కుడి వైపు గోడకి శ్రీకృష్ణుని కేలెండరు వేలాడుతున్నాయి. మధ్య ద్వారానికి ఎడమవైపున గోడకి ఆనుకుని ఒక చిన్న టేబిలు, దానిమీద ఒక నీళ్ళకూజా, ఒక గ్లాసు వున్నాయి. కుడివైపున గోడకి ఆనుకుని ఒక బట్టల స్టాండు, దానిమీద కొన్ని మాసిన బట్టలు, రాజయ్య పంచె, చొక్కా, తువ్వాలు వగైరా వున్నాయి)

తెరలేచేసరికి :- పంచె, బనీను మాత్రం వేసుకుని చేతిలో వెలుగుతున్న అగరొత్తులతో పరమేశ్వరుడి కేలెండరుకి పూజ చేస్తున్నాడు

రాజయ్య. ఈలోగా సోములు వీధిగుమ్మంలోనుండి నెత్తిమీద ఎండు గడ్డిమోపుతో వచ్చి, చేతికర్ర బట్టలస్టాండుకి దగ్గరగా గోడకి అన్చి, పెరట్లోకి వెళ్ళిపోయాడు. పరమేశ్వరుడి పూజ అయ్యాక, గాంధీగారి ఫోటో ఎదుట నిలిచి, ఏదో తప్పుచేసిన వాడిలా మెల్లగా రెండు చెంపలూ వాయించుకుని, "సోములు" అని పెరట్లోకి కేకేశాడు రాజయ్య. సోములు పెరటిలోనుండి ఓ పెద్దసైజు గ్లాసుతో కాఫీ తీసుకొచ్చి రాజయ్యకి అందించాడు)

రాజ : (కాఫీ పూర్తిగా తాగేసి) పరమేశ్వరా! (అని అలవాటు ప్రకారం ఆ పరమేశ్వరుణ్ని ఒకసారి తలచుకుని, కాఫీచెంబు సోములికి తిరిగి ఇచ్చేస్తూ) అప్పుల్రాజుకి పాలు ఇచ్చేసావా?

సోము : పొద్దుట సీకటితోనే ఇచ్చేసి వొచ్చినాను బావు!

రాజ : (టీపాయ్‌మీద వున్న దినపత్రిక చేతిలోకి తీసుకుని) ఇయ్యాల పాలు ఎన్నిసేర్లు దిగాయిరా?

సోము : అయిదుసేర్లకి కొంచెం తక్కువ దిగాయి బావు!

రాజ : మరయితే నీళ్లు ఎన్ని కలిపావురా?

సోము : పదిసేర్లకి ఎక్కువే కలిపాను బావు!

రాజ : సెబాసో! పాలేరు అంటే నీలా వుండాలిరా సోములు! ఎల్లెల్లు. ఎల్లి నీపని జూసుకో! ...ఆ సెపిటిముందకి జెప్పు – సేపల కూరలో నూని తగ్గించి ఎయ్యమను. సింతపండుకూడ పిసుంగానే వుంది. నూసి వోడమను. కారంకూడ ఎవ్వంటి తగ్గించమని చెప్పు. (వీధిలోకి దృష్టి సారించి) ఇంటిముందు ఎడ్లబండేదో ఆగినట్టుంది, పార్వతీసుంగోరు వొచ్చినట్టున్నారు. ఎల్లి చూసిరా! (చేతిలో వున్న పేపరు టీపాయ్‌మీద పడేసి, బట్టలస్టాండుమీద వున్న చొక్కా తీసి తొడుక్కున్నాడు.)

సోము : (గుమ్మందాటి వెళ్ళొచ్చి) పార్వతీసుంగోరు కాదు బావు! అమ్మాయిగోరూను, అల్లుడుగోరూను.

రాజు : అమ్మాయి, అల్లుడు ఏటిరా!.... మొన్ననే కదా పండగకి వొచ్చి ఎల్లారు. సరిగ్గా కళ్లెట్టుకు చూడు.

సోము : అల్లే దావు! కిష్నబాబును, మన సత్తెమ్మాను. (అని గుమ్మం దాటి వెళ్ళాడు.)

రాజు : (అనుమానం తీరక గుమ్మం దగ్గరకి వెళ్ళి చూసి) నిజమేనండి పరమేస్పరా! అమ్మాయి ఏడ్చుకుంటూ వస్తుందేటి! అల్లుడు కస్సుబుస్సులాడుతున్నాడేటి! .... ఇదేమో పెద్ద తగువులాగే వుంది పరమేస్పరా!

(చేతిలో సూట్ కేసు, ఎయిర్ బ్యాగ్ తో వచ్చిన సోముడు మధ్యగదిలోకి వెళ్ళిపోయాడు. అతని వెనుక వస్తున్న సత్య- తండ్రిని చూడగానే "నాన్నా!" అని బావురుమంది)

రాజు : ఏటయిందమ్మా సత్తెమ్మా! ఎందుకమ్మా ఏడుస్తున్నావు!....

సత్య : (తండ్రి ముఖంలోకి చూసి) నాన్నా! (ఏడుపు ఆపుకోలేక మళ్ళీ బావురుమంది)

రాజు : నాకు అసలే రక్తపుపోటు. నన్ను బెంబేలెత్తించక నీకొచ్చిన కష్టమేటో చెప్పు తల్లీ! (ఇంతలో బయటనుండి కృష్ణారావు రావడం చూసి) ఏంవయ్యా కిష్నయ్యా! కుశలమేనా!
(కృష్ణారావు బదులు ఇవ్వలేదు. రాజయ్యవైపు ఒకసారి సీరియస్ గా చూసి, చేతిలో వున్న బ్రీఫ్ కేసుతో మధ్య గదిలోకి వెళ్ళిపోయాడు.)

రాజు : గుడిలో అమ్మవారిలా కళ్లెర్రజేస్తాడేటి పరమేస్పరా! (కూతురితో) అల్లుడు అగ్గిపిడుగులా వున్నాడు. ఏం జరిగిందమ్మా సత్తెమ్మా!

సత్య : నాన్నా! మరేమో ...మరేమో.... ఆయనేమో.... (ఏడుపు ఆపుకోలేక ఒకసారి మళ్ళీ బావురుమంది)

రాజ : ఇదేమి ఏడుపే తల్లీ! ఏడ్చి అయినా చెప్పు. చెప్పాక అయినా ఏడు.

సత్య : (చీరకొంగుతో కళ్లు తుడుచుకుని) మరేమో....మీ అల్లుడుగారు నన్నిక్కడ వదిలేసి వెళ్ళిపోతారట నాన్నా!

రాజ : దేనికమ్మా?....అసలు మీ ఇద్దరికీ తగువు ఎందుకొచ్చింది?

సత్య : తగువేమీ రాలేదు నాన్నా! నిన్నంతా ఆఫీసుకి సెలవుపెట్టి నాతో బాటే ఇంటిలో వున్నారు. రోజంతా నాతో సరదాగానే గడిపారు. రాత్రి నేను అడగకుండానే హోటల్‌కి తీసుకువెళ్ళి బిర్యానీ తినిపించారు నాన్నా! ఆ తర్వాత సెకెండ్‌షో సినిమాకి కూడ తీసుకువెళ్ళారు. మరి తెల్లారి లేచినతర్వాత ఏమయిందో ఏమిటో, "సత్యా!" అని ఇంటికప్పు ఎగిరిపోయేలా అరిచి, "నిన్ను తీసుకెళ్ళి మీ పుట్టింటిలో వదిలెయ్యాలి. వెళ్ళి నీ సామాను సర్దుకో" అన్నారు నాన్నా!

రాజ : ఏ తగువూ లేకుండ ఎందుకొదిలేస్తాడు తల్లీ! ఏదో సరదాకి అలా అని వుంటాడు అల్లుడు.

సత్య : మొదట నేనూ నీలాగే అనుకున్నాను నాన్నా! కానీ, ఆయన ఆ మాట హాస్యానికి అనలేదట. నిజంగానే నన్నిక్కడ వదిలేసి వెళ్ళిపోతారట నాన్నా!

రాజ : ఉరుము లేకుండ పిడుగు పడటమేమిట్రా! .... అమ్మా, సత్యమ్మా! నిన్నిక్కడ వొదిలేసి ఎళ్లిపోవడానికి కారణమేటో అడక్కపోయావా?

సత్య : అడిగాను నాన్నా! ఒకసారి కాదు. వందసార్లు అడిగాను. ఎలా అడిగినా, ఎన్నిసార్లు అడిగినా ఆయన కారణం చెప్పలేదు నాన్నా!

రాజ : దీన్నిబట్టి చూస్తే అల్లుడు ఏదో పెద్ద ఎత్తులోనే వున్నాడన్న మాట. నువ్వు ధైర్యంగా వుండమ్మా సత్యమ్మా! అల్లుడ్

సంగతేటో నేను కనుక్కుంటాను. (అప్పటికే మధ్య గది గుమ్మం దగ్గరకి వచ్చి నిలుచున్న కృష్ణారావుని గమనించ లేదు) ఈ మునసబు రాజయ్య పేరు చెబితే ఈ సుట్టువక్కల గేమాలన్నీ గడగడలాడతాయి. నా సంగతికి అల్లుడికి ఇంకా సరిగ్గా తెలీదేమో! (అని మీసం మెలివేస్తుండగా తన వునికిని తెలియజేస్తూ వెనుకనుండి కృష్ణారావు దగ్గాడు. వెంటనే మీసం నుండి చెయ్యి తీసేసి) రావయ్యా క్రిష్నయ్యా! రా! రా! కూర్చో! (అని చేతుతో కుర్చీ చూపించి) ఇంటిలో అందరూ కులాసాయేనా? అల్లుడు.

కృ : మీ నాన్నగారు మీసాలు మెలివేస్తున్నట్టున్నారు. సంగతేమిటి సత్యా!

రాజ : (కంగారుగా) అబ్బే! ఏమీలేదు అల్లుడూ! మీసం వుందికదా అని ఒకసారి వూరికే అలా మెలేసాను. అంతే! .... ఒరే సోములూ! (అని కేకవేసి) అల్లుడూ! టీ తాగుతావా? కాపీ తాగుతావా? (కృష్ణారావు మౌనం చూసి) అల్లుడుగారు ఏం తాగుతారమ్మా సత్తెమ్మా!

సత్య : పొద్దుటపూట అయితే కాఫీయే తాగుతారు నాన్నా!

కృ : ఈ ఇంటిలో కాఫీమాత్రం తాగనని చెప్పు మీ నాన్నకి.

రాజ : పోనీ, అప్పలరాజు కొట్లోంచి బుహూకాపీ తెప్పించేదా?

కృ : నాకే వల్లకాదు కాఫీ అక్కర్లేదు.

సోము : (మధ్య గదిలోనుండి వచ్చి) ఏటి బావు! పిలిసినారా?

రాజ : ఎలాగు బోజనాల ఏలవుతుంది కాబట్టి ఒక పని చెయిరా సోములూ! ఆ సెరిటిముండకి చెప్పి ఈ పూటకి చికినీ వొండించి. సేపలు రాత్రికి వొండుకోవచ్చు.

సోము : అలాగే బావు! (పెరటిలోకి వెళ్ళిపోయాడు)

రాజ : అల్లుడికి కోడికూర అంటే ఎంత ఇష్టమో!

కృ : నేనేమీ తిండికి ముఖం వాచి మీ యింటికి రాలేదండీ! మీ అమ్మాయిని మీకు భద్రంగా అప్పగించేసి వెళ్ళిపోదామని వచ్చాను.

రాజ : నువ్విలా తొందరపడటం న్యాయంకాదు అల్లుడు! నా బిడ్డచేసిన తప్పు ఏటో చెప్పు నీ కళ్లెదుటే దండించి అడుగుతాను. అంతే గానీ, కారణం లేకుండ నువ్వు దాన్ని ఇక్కడ వొదిలేస్తానని అనడం నబబుకాదు అల్లుడు.

కృ : తప్పు దానిది కాదు, మీదీ కాదు. ఈ ముష్టి సంబంధం చేసుకున్న పాపానికి తప్పు అంతా నాదే! నిజానికి మిమ్మల్ని అనాల్సిన పనిలేదండీ! "కట్నాలకి, కానుకలకి లోటేమీ వుంతదు. బంగారంలాంటి సంబంధం" అని నన్ను మీ అల్లుడిగా చేశారే మా అమ్మా, నాన్న. వాళ్ళని అనాలి.

రాజ : ఈ వొంక తిరుగుడు యవ్వారమంతా దేనికిగాని అల్లుడూ! ఇప్పుడు నీకు ఏటి తక్కువయిందో చెప్పు.

కృ : నాకుగా నాకేమీ తక్కువ రాలేదుకానీ, మునసబుగారి అల్లుడిగా దర్జా వెలగబెట్టడానికి ఒక్కటి తక్కువ వచ్చింది.

రాజ : ఏటది అల్లుడూ! అదీ బేగి చెప్పేయి.

కృ : కొనిస్తానని ముందుగా మీరు మాట ఇవ్వండి.

పత్మ : ఆ వస్తువుపేరు చెప్పేవరకు మాట ఇవ్వకు నాన్నా! ఈయన ధోరణి చూస్తుంటే నిన్ను పెద్ద బుట్టలోనే వేసేలా వున్నారు.

కృ : మధ్యలో నీ గోల ఏమిటే! ఇది మామ, అల్లుళ్ళకి సంబంధించిన వ్యవహారం. నువ్వు లోపలికి వెళ్ళు.

రాజ : దాని మాటలకేంగాని అల్లుడు! నీకు కావలసిన ఆ వస్తువేటో చెప్పు.

కృ : అంత తొందరగా చెప్పేస్తే దాని విలువ ఏం వుంటుందిలెండి. కానీ, నా మనసులో వున్న ఆ వస్తువు ఏమిటో మీరు చెప్పగలరేమో ఆలోచించండి.

రాజు : ఏటేది అబ్బా అది! (క్షణం ఆలోచించి) రేడియో పెట్టే.
కృ. : కాదు.
సత్య : ఇస్త్రీపెట్టి!
కృ : ఛస్! నువ్వు నోరుముయ్యి. మీరు చెప్పండి మాఁవగారు!
రాజు : ఆఁ (ఇంటికప్పుకేసి చూసి) సీలింగ్ పేను.
కృ : అదీ కాదు.
సత్య : అయితే షేవింగ్ సెట్టే!
కృ : నువ్వు నోరుమూసుకు లోనికి వెళ్తావా, నాలుగు తన్నమంటావా,
సత్య : తంతాను....తంతాను అంటున్నారు. ఆయనకి కావలసిన వస్తువు పుట్టాలేమో నాన్నా!
కృ : ఇలే పొగరుగా వుందే నీకు. (అని సత్యని వెంట తరిమేసరికి ఆమె తుర్రున మధ్యగదిలోకి పారిపోయింది.) ఉండు, నీపని తర్వాత చెబుతాను.
రాజు : ముందు నావని పట్టేసేలా వున్నారు పరమేస్వరా! (కృష్ణారావు వెనక్కి తిరిగేసరికి) దాని అల్లరికేంగాని అల్లుడు! నీకు కావలసిన ఆ వస్తువేదో నీ నోటితోనే చెప్పేసెయ్యి. అదేటోగాని, నా బుర్రకి తోచకుండా వుంది.
కృ : చెప్పేయ్యమంటారా, అయితే!
రాజు : నాకసలే రక్తపుపోటు. బేగి చెప్పేసియ్యి అల్లుడు!
కృ : మిమ్మల్ని ఇంకా సస్పెన్సులో పెట్టడం బావుండదు. చెప్పేస్తున్నాను వినండి. ఆ వస్తువునకు రెండు చక్రములు వుండును.
రాజు : ఓహోహో సైకిలా,
కృ : కాదు మాఁవగారూ! ఆ వాహనం పెట్రోలు లాగితేనేగాని నడుగెత్తదు. దాని నామధేయము తెలుగు, ఇంగ్లీషు భాషల్లోనూ స్కూటర్ అనే అందురు.

రాజ : స్కూటరే (బేసుమన్నాడు)

కృష్ణ : అదేమిటండీ! ఏ ఇంపాలోకారో, హెలికాప్టరో కొనిమ్మని అడిగినట్టు అలా తెల్లమొహం వేశారు. నేను అడిగింది అక్షరాలా ఒక స్కూటర్ దాని ఖరీదు మహా అయితే, పదివేలు వుంటుందేమో!

రాజ : పదివేలే!....(మూర్ఛవచ్చినంత పనయింది)

కృష్ణ : అయిదారువేలు ఖరీదుచేసే స్కూటర్లుకూడ వున్నాయనుకోండి. కానీ, మునసబుగారి అల్లుడిగా మన డిగ్నిటీకి అవి సరి తూగవు. ఈ మధ్య మార్కెట్లోకి కొత్త స్కూటర్ ఒకటి వచ్చిందిలెండి, బ్లాక్‌లో పదివేలు పెడితే, రేపు వుదయానికల్లా మన ఇంటిగుమ్మం ముందు వుంటుంది.

రాజ హా....హా....హా.... అల్లుడుగారు హాస్యాలాడుతున్నారు పరమేశ్వరా!

కృష్ణ హి....హి . హి....పెద్దవారు. మీతో నాకు హాస్యాలేమిటి పరమేశ్వరా?....నేను స్కూటర్ కావాలని మిమ్మల్ని నిజంగానే అడుగుతున్నానండీ.

రాజ నువ్వు అడగక ) బాగానే వుందయ్యా కిష్టయ్యా! కానీ, అంత వరకు నేను తూగవద్దా? ... ఏ సైకిలో, సీలింగుపేనోలాటి చిన్న వస్తువేదయినా కొనియ్యగలను. గానీ, ఒక్కసారే నువ్విలా గొంతెమ్మ కోరికలు కోరితే నేనెక్కడ చావాలి చెప్పు.

సత్య : (మధ్యగదిలోనుండి వచ్చి) మానాన్న అమాయకత్వం చూసుకుని ఆయనను దోచెయ్యాలనుకోవడం అన్యాయం, అక్రమం.

కృష్ణ : ఏం? మీ నాన్నమాత్రం వూళ్ళో అమాయకులందర్నీ దోచెయ్యటం లేదా?

రాజ : ఈ మాయమాటలన్నీ నీకెవరు చెప్పారయ్యా కిష్టయ్యా!....

శివుడు ఆజ్ఞ ఇస్తే చీమ కుదుతుందేమోగానీ, నేను మాత్రం కలలోకూడ ఎవరికీ హాని తలపెట్టను.

కృ : అవునవును. ఆ పరమేశ్వరుడి తర్వాత మీ పేరే చెప్పుకోవాలి.

సత్య : మా నాన్నని మీరు చాలా 'ఇన్సల్ట్' చేస్తున్నారు. మీమీద పరువు నష్టం దావా వెయ్యాల్సి వస్తుంది.

కృ : అసలు మీ నాన్నకి పరువు వుంటేకదా నష్టం రావడానికి.

రాజ : అల్లుడూ! ఈ గొడవంతా దేనికి గానీ, నీకు స్కూటరేకదా కావాలి?

కృ : అవును.

రాజ : అయితే ఈ ఒక్క యేడాది కాస్త ఓపిక పట్టు. వచ్చే దీపావళి నాటికి నువ్వు కోరిన ఆ స్కూటర్ తప్పక కొనిస్తాను.

కృ : (సీరియస్‌గా) అయితే ఒక పని చెయ్యండి. (సత్య చెయ్యి రాజయ్య చేతిలో పెట్టి) వచ్చే దీపావళివరకు మీ అమ్మాయిని మీ ఇంటిలోనే వుంచుకోండి. మీరు స్కూటర్ కొన్న తర్వాత ఆ స్కూటర్‌తోబాటే మీ అమ్మాయిని తీసుకువెళ్తాను. (వీధి గుమ్మంవైపు అడుగు వేశాడు.)

రాజ : (వెంటనే కృష్ణారావు చెయ్యి పట్టుకుని గాభరాగా) అల్లుడూ!

సత్య : మధ్యలో నేనేం చేశానండీ! నన్ను వదిలేసి వెళ్ళిపోతానంటున్నారు?.. మా నాన్న స్కూటర్ కొనివ్వకపోతే ఆ కోపమేదో ఆయనమీద చూపించాలిగానీ, నామీద దేనికి?....

కృ : దేనికా? నువ్వు ఈ నాన్న కూతురువి గనుక.

సత్య : అయితే నన్నిక్కడ నిజంగానే వదిలేసి వెళ్ళిపోతారా?

కృ : ఆహా? అందులో సందేహమేమీ అక్కర్లేదు.

సత్య : వింటున్నావా నాన్నా! ........ నన్నిక్కడ వదిలేసి వెళ్ళిపోతారట. ఆయనని వదిలిపెట్టి ఒక్క క్షణమైనా నేను వుండలేనే. ఎలా నాన్నా! నన్ను వదిలేసి వెళ్ళొద్దని ఆయనకి నువ్వు అయినా నచ్చచెప్పు నాన్నా!

రాజా : నువ్విలా తొందరపడటం మంచిదికాదు అల్లుడు! నన్ను కొంచెం ఆలోచించుకోనియ్యి.

కృ : తొందరేమీ లేదు. మీకు డబ్బే ఎక్కువో, మీ అమ్మాయి బ్రతుకే ముఖ్యమో బాగా ఆలోచించుకునే చెప్పండి. (అని మధ్య గది గుమ్మం దగ్గరకు వెళ్ళి ఆగి) సత్యా! నేను కాసేపు ఈ గదిలో పడుకుంటాను. నేను లేచేవరకు ఎవర్నీ లోనికి రానివ్వకు. సోములుచేత అగ్గిపెట్టె ఒకసారి పంపించు. (గదిలోకి వెళ్ళి పోయాడు)

రాజా : నా కొంప తగలేసేలా వున్నాడు పరమేశ్వరా! (చేతులకుర్చీలో కూర్చుని, పక్కనే స్టూలుమీద నున్న చెంబులో నీళ్ళు గట గటా గొంతులో పోసుకున్నాడు.)

సత్య : సోములూ! సోములూ!

సోము : (లోపలినుండి) వత్తన్నా అమ్మాయిగోరూ! (వచ్చి) పిలిసారా! అమ్మాయిగోరూ!

సత్య : ఈ గదిలోవున్న శ్రీకృష్ణులవారికి అగ్గిపెట్టె కావాలట. సిగ రెట్టు కాల్చుకోవడానికిలా వుంది తీసుకువెళ్ళు.

(టేబిల్‌మీద నీళ్ళకూజా పక్కనేవున్న అగ్గిపెట్టె తీసుకుని, సోములు మధ్యగదిలోకి వెళ్ళిపోయాడు. సత్య టేబిల్‌మీద వున్న కార్డుతీసి అటు, ఇటు చూసి)

సత్య : ఇది తమ్ముడు రాసిన వుత్తరంలా వుందే, ఏమిటి నాన్నా! రాశాడు?

రాజా : అదా, కాలేజీకి జీతం కట్టాలంట. వెంటనే అయిదువందలు పంపమని రాసాడమ్మా!

సత్య : కాలేజీ ఫీజుకి అయిదువందలు ఏమిటి నాన్నా!

రాజా : ఏమోనమ్మా! నాకు మాత్రం ఏం తెలుసు? వాడు పంపమని రాసాడు. నేను పంపించాను. వాడు బాగా చదువుకుని వృద్ధిలోకి

వస్తే నాకదే చాలు. అందుకోసం ఎంత డబ్బు అయినా నేను ఖర్చుపెడతాను. వాడు పెద్ద పెద్ద చదువులు చదివి, ఏ తాసిల్దారో....

సత్య : కలెక్టరో అయితే చూసి మురిసిపోవాలనుకుంటున్నావు. కానీ, నీ ఆశ ఎప్పటికీ నెరవేరదు నాన్నా: వాడిని ఎప్పటికయినా నువ్వొక తాగుబోతుగానే చూస్తావు.

రాజు : అదేటమ్మా సత్తెమ్మా! అలా అంటావు.

సత్య : నేను చెప్పింది నిజమే నాన్నా! వాడు అడిగినప్పుడల్లా నువ్వు వందలకి వందలు డబ్బు పంపిస్తున్నావు. వాడేమో చదువు ఎగ్గొట్టేసి, నువ్వు పంపే డబ్బుతో అక్కడ తాగి తందనాలాడుతున్నాడు. మొన్న నొకసారి తమ్ముడు, వాడి స్నేహితులు హాస్టల్ రూములో తాగుతుండగా మీ అల్లుడుగారు కళ్ళారా చూశారు.

కృష్ణ : (మధ్య గదినుండి సిగరెట్టు కాలుస్తూ వచ్చి) మీ నాన్న గడించిన ఆస్తి అంతా మీ తమ్ముడి తాగుడికే ఖర్చు పెట్టేలా వున్నాడు. పాపం సొమ్ము అలాంటి పాపపుపనులకే గానీ, మంచి పనులకి పనికిరాదేమో!.

రాజు : అల్లుడు కదా అని వూరుకున్నకొద్దీ నీ మొగుడు ఎలా రెచ్చిపోతున్నాడో చూశావా, అమ్మా!

సత్య : పడుకుంటానని చెప్పి మళ్ళీ ఎందుకొచ్చారండీ బయటికి?

కృష్ణ : లోపల వుక్కబెట్టి చంపుతుంటే ఎలా పడుకోమంటావు?

రాజు : అదేటయ్యా కిష్నయ్యా! గదిలో పేను వుంచుకుని వుక్కబోస్తుందంటావు?

కృష్ణ : ఫేనూ ఉంది. కరెంటూ ఉంది. ఏటొచ్చి స్విచ్చిస్తే బాగులేదు. మీ దగ్గర ఇనప్పెట్టె ఉంది, పెట్టెలో డబ్బూ వుంది, ఇవ్వడానికి మనసే లేనట్టు....సోములూ! ఆ వైరు ఇలా తీసుకురా!

(సోములు మధ్య గదిలోనుంచి పొడవాటివైరు ఒకటి తీసుకు వచ్చి కృష్ణారావుకి ఇచ్చాడు )

రాజ : ఆ వైరు దేనికయ్యా? కిష్నయ్యా!

కృ : ఉరేసుకు చావడానికి మాత్రం కాదులెండి. ఆ గదిలో వున్న ఫేను తిరగడానికి ఈ గదిలోనుండి కనెక్షన్స్ తీసుకోవాలి ఏం? అదికూడ మీకు చెప్పి చెయ్యాలా?

రాజ : నీ మొగుడి మాటలతో నాకు మళ్లీ రక్తపుపోటు వచ్చేనీలా వుందమ్మా, సత్తెమ్మా!

సత్య : మనం ఎదురుగా ఉంటే ఆయన అలా వాగుతూనే వుంటారు. కాసేపు మనం అలా పెరటిలోకి వెళ్ళి కూర్చుందాం. పద నాన్నా!

(సత్య రాజయ్యను తీసుకుని పెరటిలోకి వెళ్ళిపోయింది. కృష్ణారావు అంతవరకు చేతిలో దాచిపెట్టిన టేప్‌రికార్డర్ మైకుని టేబిల్‌మీద నీళ్ళకూజా పక్కనే అమర్చి, పోస్టుకార్డు చాటుగా వుంచాడు. ఇంతలో వీధిగుమ్మంలోనుండి, "రాజయ్యా, రాజయ్యా!" అంటూ కరణం కనకయ్య గొంతు వినిపించింది. కృష్ణారావు సోముల్ని దగ్గరకు పిలిచి, అతని చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు.)

సోము : (అలకిస్తూ) అలాగే....అలాగే బావు! నాను చూసుకుంటాను. మీరు ఎల్లండి. (కృష్ణారావు మధ్య గదిలోకి వెళ్ళిపోయాడు. కనకయ్య రావడం చూసి) దండాలండీ కరనంగోరూ!

కన : ఏరా సోములూ! మీ దొరగారు ఎం చేస్తున్నార్రా?

సోము : ఇప్పుడే అలా పెరటిలోకి ఎల్లారు బావు!

కన : తొందరగ వెళ్ళి నేను వచ్చానని చెప్పు.

సోము : (ఇంతలో రాజయ్య పెరటిలోనుండి చుట్ట కాలుస్తూ రావడం చూసి) అదుగో బావు! మా ఎలోనే వస్తున్నారు.

రాజ : అల్లుడు ఏం చేస్తున్నాడ్రా సోములూ!

సోము : లోపల నిద్దరోతన్నారు. లేపమంటారేటి బావు?

రాజ : అక్కర్లేదు. ఎల్లి నీ పని జూసుకో! (సోములు మధ్య గది లోకి వెళ్ళిపోయాడు.)

కన : పార్వతీశంగారు ఇంకా రాలేదా, రాజయ్యా!

రాజ : పన్నెండు గంటలకి కదా ఆయన వస్తామన్నారు, ఇంకా పన్నెండు అవలేదేమో!

కన : పట్నంనుండి కూతురు, అల్లుడు వచ్చినట్టున్నారు. ఏమిటి రాజయ్యా, విశేషమేమన్నా వుందా?

రాజ : ఆఁ లేకేం, పెద్ద విశేషమే ఉంది. అమ్మాయిని ఇక్కడ వొది లేసి ఎల్లిపోతానంటున్నాడు అల్లుడు.

కన : పెద్ద లిటిగేషనే! అసలు ఇద్దరికీ తగువు ఎందుకు వచ్చిందట?

రాజ : తగువు లేదు. తలకాయ లేదు. ఆయనగారి అంతోటి దర్జాకి స్కూటర్ ఒకటి లోటు వచ్చిందట. అది కొనిచ్చేవరకు అమ్మాయిని ఏలుకోడట. కొనిస్తానుగానీ, కొన్నాల్లు ఆగ వయ్యా మొగుడా! అంటే వినిపించుకోడే!

కన : ఊఁళ్ళో వాళ్ళందరికీ నువ్వు మొగుడివయితే నీ అల్లుడు నీకు మొగుడయ్యాడు. మొత్తానికి భలే అల్లుణ్ని సంపాయించా వయ్యా!

రాజ : హాస్యాలకేంగానీ, పరమేస్పరా! ఇప్పుడు ఏన్నేం చెయ్య మన్నావో చెప్పు.

కన : స్కూటరే కదా అడిగాడు. ఏ లిటిగేషనూ వుండదు. కొని ఇచ్చేసెయ్యి. స్కూటర్‌తో సరిపెట్టాడు కాబట్టి సంతోషించు. కారే కావాలని పట్టుబడితే ఏం చేసేవాడివి? అమ్మాయి కాపురం నిలబెట్టడంకోసం కొనివ్వాల్సిందే గదా!

రాజు : అదేదో సామెత జెప్పినట్టు— కాలిలో ముల్లు గుచ్చుకుందయ్యా అంటే, కాలే తీసేమన్నాడట నీలాంటివాడే। అలా వుంది నీ సలహా।

కన : మరయితే అల్లుడికి స్కూటర్ కొనివ్వవా ఏమిటి?

రాజు : కొనియ్యాల్సిందేనయ్యా! కానీ చూస్తూ నా ఇనప్పెట్టెనుండి ఒక్కసారే పదివేలు తియ్యాలంటే చేతులు రావడంలేదు. అంచేత ఆ పదివేలు ఎలాగోలా పార్వతీసుంగోరి దగ్గరే లాగాలి.

కన : నాకూ నీలాంటి లిటిగేషనే ఒకటి వచ్చిపడిందయ్యా! అదృష్టం కొద్దీ మా మూడో అమ్మాయికి పెళ్ళి సంబంధం ఒకటి కుదిరింది. కట్నం ఇరవై వేలకి సెటిలయిందనుకో। కానీ, ప్రస్తుతానికి నా దగ్గర అంత రొక్కం లేదే। అంచేత రాజయ్యా! ఒకలా చెయ్య. పార్వతీశం వచ్చేక ఇరవై వేలకి బేరం పెట్టేసెయ్య చెరో పదివేలూ పంచుకుందాం.

రాజు : ఇది చాలా అన్యాయం కనకయ్యా! పార్వతీసుంగోరు ఇచ్చే డబ్బు మా అల్లుడికి స్కూటర్ కొనాలని నేను ఆలోచిస్తుంటే మధ్యలో మీ అమ్మాయి కట్నం అని లిటిగేషన్ పెడతావేటి పరమేస్పరా!

కన : అదేమిటి రాజయ్యా! అలా మాట్లాడుతావు. మొన్న పూరిళ్ళు తగలబడిపోయినప్పుడు, వచ్చిన గ్రాంటులో అయిదువేలు మిగిలిస్తే నువ్వేకదా తీసుకున్నావు.

రాజు : మీ రెండో అమ్మాయి పెల్లి అని జెప్పి సారాకేసుల్లో వచ్చిన కమీషన్ డబ్బు పదివేలు నువ్వు తీసుకోలేదా కనకయ్యా?

కన : (ఇబ్బందిగా నవ్వి) నీకూ, నాకు తగాదా ఎందుకుగానీ, రాజయ్యా! ఒకలా చేద్దాం. పార్వతీశం పదివేల లోపు ఎంత యిచ్చినా నువ్వు తీసుకో। పదివేలకి మించి ఏం ఇచ్చినా నేను తీసుకుంటాను. ఏమంటావ్?

రాజ : అలా అన్నావు బాగుంది. (వీధిగుమ్మంవైపు చూసి) అదిగో మాటలోనే వస్తున్నాడు పార్వతీశం.
(ఇంతలో వీధిగుమ్మంనుంచి పార్వతీశం వచ్చాడు. అతను వేసుకున్న ఖరీదైన దుస్తులనుబట్టి అతను బాగా డబ్బు వున్న వాడని తెలుస్తుంది.)

పా : నమస్కారం రాజయ్యగారూ!

రాజ : నమస్కారం, రండి....రండి....మీకోసమే ఎదురుచూస్తున్నాం.

పా : కరణంగారుకూడ వచ్చేశారే! నమస్కారమండీ కనకయ్య గారూ !

కన : నమస్కారం....నమస్కారం. రండి, దయచేయండి.

రాజ : కాఫీ తీసుకుంటారా? టీ తీసుకుంటారా?

పా : ఇప్పుడు అవన్నీ ఎందుకు లెండి?

కన : పోనీ, తీర్థంలాంటిది ఏమన్నా?....

పా : అలాంటివేం పెట్టకండి ఇప్పుడు. మధ్యాహ్నం తాలూకా ఆఫీసుకి వెళ్ళాల్సిన పనొకటి ఉంది. కావలిస్తే రాత్రికి కూర్చుందాం.

కన : రాత్రికి ఎలాగూ తప్పదనుకోండి. కానీ, మొక్కుబడికయినా ఇప్పుడు మనం ఒక్కో గ్లాసు పుచ్చుకోవాలి. లేకుంటే, మా రాజయ్య చాలా బాధపడతాడు.

రాజ : అబ్బ, కనకయ్యా! ఎప్పుడూ మందు గొడవేనా! .... ఆయన ఏమీ తీసుకోను మొర్రో అంటే ఎందుకు ఇబ్బంది పెడతావు. పార్వతీసుంగారూ! ఈ కనకయ్య మాటలకేంగానీ, అసలు విషయానికి రండి.

కన : అవునుకదూ! ఆ లిటిగేషన్ సంగతే మర్చిపోయాను. చెప్పండి పార్వతీశంగారూ!

పా : ఒకటి, రెండురోజులు ఆలస్యం జరిగినా ఫర్వాలేదు కానీ, ఈ తగువు మట్టుకు చాలా గుట్టుగా పరిష్కారమైపోవాలి.

కన : మీకా అనుమానం అక్కర్లేదు పార్వతీశంగారూ! మా దగ్గరకి ముందుగా వచ్చిన ఏ కేసుకీ అపజయం వుండదు. ఈ వూళ్లో ఎవరికి ఏ తగువు వచ్చినా తీర్పు మేము చెప్పాలి. మేము ఇచ్చే తీర్పుని జనం ఆమోదించి తీరాలి.

రాజ : ఒకేల మా తీర్పు కాదని దయిర్యం చేసి ఎవడయినా కోర్టుకి ఎల్లాడే అనుకోండి. అక్కడకూడ మనం ఇచ్చిన తీర్పే నిల బడుతుంది. ఎంచేత నిలబడుతుంది? అక్కడ పోలీసు ఎంకట స్వామి మన పక్షమే వుంటాడు. తాసీల్దారు రామచంద్రయ్య మన మాటే రైటు అంటాడు. పంచాయితీ ప్రెసిడెంటు పాపా రావు మనం చెప్పిందే యేదం అంటాడు.

కన : వాళ్ళే అన్న మాటేమిటి? విజిలిగొండ రామ్మూర్తి, గజ్జల రామిరెడ్డి, సత్తుల సూర్యనారాయణ....ఎవరైనా సరే, మనం ఎంత అంటే అంతే!

పా : అబ్బబ్బ! ఈ తగువు అన్నితగువుల్లాంటి కాదండీ! న్యాయం అటు పక్షమే వుంది కాబట్టి,కోర్టుకి వెళితే మనమే ఓడిపోతాం.

కన : న్యాయం ఎవడికి కావాలండీ! డబ్బు ఖర్చుపెట్టడానికి మీరు సిద్ధమేకదా!

పా : ఈ తగువు నేను అనుకున్నట్టు పరిష్కారం కావాలిగానీ,డబ్బు దేముందండీ! ఎంతయినా ఖర్చుపెడతాను.

కన : ఇంకేం! కొండమీద కోతికూడ దిగొచ్చి మన తరపునే సాక్ష్యం చెబుతుంది.

రాజ : న్యాయం— బొచ్చుకుక్కలాటిదండీ పార్వతీసుంగోరూ! అవతలి వాడు దానికి బిస్కట్టుముక్క ఏసి మచ్చిక చేసుకోవాలని చూసాడనుకోండి. మనం మాంసంముక్క ఇసురుతాం.అప్పుడు అది తోకాడించుకుంటూ మన ఎంటే పరుగెత్తుకొస్తాది.

పా : ఏది ఏమైనా ఈ తగువు కోర్టుకి వెళ్ళడం నాకిష్టంలేదు. ఇక్కడే మన వూళ్ళోనే పరిష్కారం మైపోవాలి. ఎంత గుట్టుగా జరిగిపోతే అంత మంచిది.

రాజ : అలాగేనండీ పార్వతీసుంగారూ! ఇంతకీ తగువు ఏటో చెప్పారు కాదు.

పా : నాకున్న సమస్య మాత్రమే మీకు చెబుతాను. ఇక తగువు పెట్టాల్సిందీ. తీర్పు చెప్పాల్సిందీకూడ మీరే.

కన : పెద్ద లిటిగేషనే! సరే ముందు తగువు ఎవరికి పెట్టాలో చెప్పండి.

పా : నా కొడుక్కి, కోడలికి.

రాజ : మీ తగువు బలే సిత్రంగా వుందే!

కన : మేము చెప్పాల్సిన తీర్పు.

పా : కొడుకుని, కోడల్ని వేరు చెయ్యడం.

రాజ : ఇలాటి తగువు నేనెక్కడా ఇనలేదు పరమేస్వరా!

కన : అసలు మీకీ సమస్య ఎందుకొచ్చిందండీ పార్వతీశంగారూ!

పా : బుద్ధిగా చదువుకోరా బాబూ! అని మావాడిని పట్నం పంపిస్తే, వాడేమో గుడ్డిగా ఒక పిల్లను ప్రేమించి, చక్కా పెళ్ళిచేసుకు వచ్చాడు. ఆ పిల్లదేమో మా కులంకాదు. మన మతం అసలే కాదు. ఆ పిల్ల తండ్రేమో టీ నీళ్ళకి తికానాలేని మనిషట. అంచేత ఆ పిల్ల తరిఫున మనకి పైసా కలిసిరాదు. మావాడి తొందరపాటు పనివల్ల నేను తలెత్తుకోలేకుండ వున్నాను. ఇంకో నాలుగు రోజులు పోతే మా బంధువాళ్ళు నలుగురూ కలిసి మమ్మల్ని వెలివేసినా వేస్తారు. అన్నిటికన్నా ముఖ్యం. మావాడి ఈ పెళ్ళి [illegible] వలన మూడులక్షల ఆస్తి చేజారిపోయిందండి.

రాజ : మూడు [illegible]

పా : మా బావమరిది సింహాద్రిబేమా! అతని కూతుర్ని గనక మా వాడు చేసుకుంటే మూడులక్షల ఆస్తి రాసిస్తానన్నాడు. ఈ దరిద్రపు వెధవ తొందరపడి ఆ తలమాసినదాన్ని ఎవ త్తెనో కట్టుకుని నాకు మూడులక్షల నష్టాన్ని కలిగించాడు.

రాజు : ఇప్పుడు మీ కొడుకుని, కోడల్ని వేరుచేస్తే, ఆ పోయిన మూడులచ్చల ఆస్తి మళ్లీ కలిసొచ్చే అవకాశం ఏమన్నా వుందా?....

పా : ఇప్పుడు నేను పడుతున్న ప్రయాస అంతా అందుకోసమే గదండీ! మా వాడికి తన కూతుర్ని ఇవ్వాలన్న ఆశ మా బావ మరిది ఇప్పటికీ చంపుకోలేదు. ఈ శనిదేవతని మెల్లగా వది లించుకుని, మా వాడిని మళ్ళీ పెళ్ళికి ఒప్పించగలిగితే పోయిం దనుకున్న ఆ మూడులక్షల ఆస్తి తిరిగి రాబట్టుకోవచ్చు.కానీ, మా వాడి ధోరణి చూస్తుంటే ఈ ముష్టిముండని ఈ జన్మకి కాదుగదా, మరో జన్మలోకూడ వదిలేలా లేడు.

కన : వదిలించే పూచీ మాకు వదిలేసి, మీరు మాకు ఇచ్చే ప్రతిఫలం సంగతి మాట్లాడండి.

పా : అన్నీ సవ్యంగా నేను అనుకున్నట్టు జరిగితే పదివేలు ఇస్తాను.

కన : అబ్బే! ఇలాంటి లిటిగేషన్ కేసుల్లో పాతికవేలకి తక్కువ ఎప్పుడూ మేము తీసుకోలేదు. మీరు కాబట్టి కన్సెషన్ క్రింద ఓ అయిదువేలు కొట్టేస్తున్నాం.ఇరవై వేలకి ఖాయం చెయ్యండి.

రాజు : తగువు ఎట్టడానికి పదివేలు. తీర్పు చెప్పడానికి పదివేలు.

కన : వెరసి ఇరవై వేలు.

పా : ఏమైనా ఇరవై వేలు అంటే ఎక్కువే!

రాజు : ఇరవై వేలకోసం చూసుకుంటే మూడు లచ్చలకి నష్టపోతారు. అది ఆలోచించండి.

పా : (క్షణం ఆలోచించి) సరే! మీమాటే కానివ్వండి. కానీ, నెల రోజుల్లోగా జరిగిపోవాలి సుమా.

కవ : ఇలాంటి లిటిగేషన్ వ్యవహారాలు మాకు కొత్తేమీ కాదు. మేము మాట ఇచ్చామంటే, జరిగిపోయినట్టే లెక్క. మీరు నిశ్చింతగా ఉండండి.

సత్య : (పెరటిగుమ్మంలోనుండి వస్తూ) తగువు చెప్పడం అయిందా నాన్నా!

రాజు : (కంగారుపడి) తగువా? తగువు ఏటమ్మా! మేము పంచాయితీ ఎన్నికల గురించి మాటాడుకుంటున్నాం. తగువు గురించి కాదమ్మా!

కవ : అవునమ్మా సత్యా! మేము ముగ్గురం కలిసి చాలారోజులయింది. అందుచేత సరదాగా ఆ కబుర్లు, ఈ కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం....అబ్బాయి కులాసాయేనా అమ్మా!

సత్య : ఆఁ (అంది ముక్తసరిగా)

రాజు : కిష్నయ్య ఇంకా పడుకుని లేవలేదా అమ్మా! బోజనానికి ఏలవు తుంది ఎల్లి లేపు. అన్నట్టు, పార్వతీసుంగోరి గురించి నీకు తెలీదు కదూ! ఈయన మన వూరి కామందుల్లో ఒకరు. ఈ సుట్టుపక్కల గేమాలన్నిటిలో ఈయనకి బాగా పలుకుబడి వుంది. ఇంకా చెప్పాలంటే....

సత్య : ఈయనకి ఒక కొడుకు వున్నాడు. ఆ కొడుకు పట్నంలో ఒక పిల్లను ప్రేమించి పెళ్ళిచేసుకు వచ్చారు. ఆ పెళ్ళి వలన ఈయనకి మూడులక్షలకి ఆస్తినష్టం వచ్చింది.

రాజు : (హతాశుడయి) అమ్మా సత్తెమ్మా!

సత్య : ఇప్పుడు ఆ పిల్లని వేరుచేసి, కొడుక్కి మరో పెళ్ళిచేస్తే ఆ మూడులక్షల ఆస్తి కలిసొస్తుంది. వాళ్ళిద్దరి మధ్య తగువు పెట్టి, వాళ్ళను వేరుచేస్తే నీకు, [illegible] పదివేలు ముట్టచెబుతాడు.

రాజు : ఈ విషయాలన్నీ నీకెలా తెలిసాయి తల్లీ!

సత్య : ఏంటే తెలుస్తాయి నాన్నా!

కన : నువ్వు విన్నది పొరపాటు అమ్మా సత్యా! పార్వతీశంగారి కొడుక్కీ, కోడలికీ మధ్య తగువు వస్తేనూ, తీర్పు చెప్పడం కోసం నన్నూ, మీ నాన్ననూ....

రాజ : అంతేనమ్మా, అంతే! అంతకు మించి మేము ఏమీ మాట్లాడు కోలేదు.

సత్య : ఎందుకు నాన్నా, యింకా బుకాయిస్తావు? మీరు మాట్లాడుకున్న విషయాలన్నీ నేను చాటునుంచి విన్నాను.

కన : అమ్మా సత్యా! ఇవన్నీ పెద్దవాళ్ళ వ్యవహారాలు. చిన్నపిల్లవి. నీకెందుకమ్మా ఇవన్నీ?....

సత్య : మీవంటి పెద్దలు చెయ్యాల్సిన పనేనా కనకయ్యగారూ ఇది. పాపం, ఆ అమ్మాయి మీకేం అపకారం చేసిందని ఆమె పచ్చని జీవితంలో చిచ్చుపెట్టాలని చూస్తున్నారు? ఈమెకూడ నాలాంటి మీ కూతురులాంటి ఆడపిల్లేనండీ! మీ కూతురే ఆ పిల్ల స్థానంలో వుంటే అని మీరు, మా నాన్న ఒక్కసారి ఆలోచించండి. ఈరోజు ఆ అమ్మాయికి జరుగుతున్న అన్యాయం, రేపు మీ పిల్లలకికూడ జరగవచ్చు. మీకూ ఏడుగురు ఆడపిల్లలు వున్నారు. కాస్త దూరమాలోచించండి కనకయ్య గారూ!

కన : రాజయ్యా! పెళ్ళయ్యాక నీ కూతురు చాలా మారిందయ్యా!

పా : ఎంత చదువుకున్నా ఆడపిల్లలకు అంత పొగరు పనికిరాదండీ! మరి కొన్నాళ్ళు మీరు ఈ మునసబు గిరిలో వుండాలనుకుంటే మీ అమ్మాయిని కాస్త అదుపులో వుంచడం మంచిది.

సత్య : చూడండి పార్వతీశంగారూ! ఎంత మా నాన్న నన్ను అదుపులో ఉంచినా నా కళ్ళముందే ఇలాంటి ఘోరాలు జరుగుతుంటే చూస్తూ వూరుకోలేను ఆ అమ్మాయిని మీ కొడుకు పేరు చేయి పట్టి వేరు

చెయ్యాలనే ప్రయత్నమే జరిగితే, ఆమె తరపున వకాల్తా పుచ్చుకుని ఆమెకు న్యాయంజరిగేలా కోర్టులో నేను వాదిస్తాను. చట్ట సమ్మతంగా రిజిష్టర్ మేరేజీ చేసుకున్న భార్యాభర్తల్ని విడదీయాలనుకోవడం ఎంత నేరమో, దాని పర్యవసానం ఏమిటో అప్పుడు తెలుస్తుంది.

పా : చిన్నపిల్ల కదా అని వూరుకున్నకొద్దీ మీ అమ్మాయి చాలా దూరం వెళ్ళిపోతుందే!

రాజ : అది పిచ్చిపిల్ల బాబు! దానికి లోకజ్ఞానం తక్కువ. దాని మాట లేవీ మనసులో పెట్టుకోకండి పార్వతీశంగారూ!

పా : సర్లెండి. ఇంతకీ మా తగువు చేపట్టినట్టేనా? లేక మీ అమ్మాయి మాట విని మీ నిర్ణయంగానీ మార్చుకున్నారా?

రాజ : అమ్మమ్మ! ఎంతమాట పరమేశ్వరా? ఒక్కసారి మాట ఇచ్చాక తిరిగి తీసుకోవడం ఈ రాజయ్య జాతకంలోనే లేదండీ.

పా : మీమీద ఆ నమ్మకం వుండబట్టే, ఈ తగువు మీముందుకి తెచ్చాను

కన : మరి మీరు ఇస్తామన్న ఆ ఇరవై వేలు.

పా : పని పూర్తి అయిన తర్వాత తీసుకోండి.

రాజ : అలాకాదు. పనికి ముందు పదివేలు. మిగతాది ఆ తర్వాత ఇయ్యండి.

పా : సరే, అలాగే కానివ్వండి.

సత్య : పదివేల రూపాయలకోసం ఎంత నీచానికి దిగజారిపోయావు నాన్నా!

రాజ : ఇందులో నా తప్పేముంది అమ్మా! నన్ను ఈ స్థితికి దింపింది నీ మొగుడే. ఉన్న పళంగా స్కూటర్ కొనిమ్మని నా పీకల మీద కూర్చుంటే నేను మాత్రం ఏం చెయ్యను చెప్పు?

సత్య : అలా అని చెప్పి ఒక ఆడపిల్ల గొంతుకోస్తావా? చాలా అన్యాయం నాన్నా!

రాజ : అన్యాయం కాదు తల్లీ! అవసరం. అల్లుడికి స్కూటర్ కొనిస్తేనే గానీ, నిన్ను ఏలుకోడు. పదివేల రూపాయలు పెడితేనే గానీ స్కూటర్ రాదు. అందుకనీ....

సత్య : మరో ఆడపిల్ల కాపురాన్ని కూలదోస్తానంటావు. నీ కూతురి మీద నీకు ప్రేమ వున్నట్టే, ఆ పిల్ల తల్లిదండ్రులకికూడ ఆ పిల్లమీద ప్రేమ వుంటుందనీ, నా కాపురం చెడిపోతే నువ్వెంత బాధపడతావో, ఆ విధంగానే ఆ పిల్ల తల్లిదండ్రులూ బాధపడతారని గ్రహించు నాన్నా!

రాజ : నా కడుపున బుట్టి నాకే నీతులు చెబుతుంది పరమేశ్వరా!

పా : రాజయ్యగారూ! మధ్యాహ్నం తాలూకా ఆఫీసుకి వెళ్ళే పని వుంది. ఇక నాకు సెలవు ఇప్పించండి.

కన : మరి నేనూ వెళుతున్నాను రాజయ్యా! మీ తండ్రీ కూతుళ్ళ తగువు ఇంత త్వరగా తెల్లారేటట్టు లేదు,
(పార్వతీశం, కనకయ్య వెళ్ళడానికి సిద్ధమయ్యారు. కృష్ణారావు అప్పటికే మధ్య గది గుమ్మం దగ్గర నిలుచున్నాడు.)

కృ : అయ్యా కరణంగారూ, కామందుగారూ ఈ తగువు నేను తెల్లారుస్తాను. వెళ్ళిపోకండి.

(పార్వతీశం, కనకయ్య ఎక్కడివారు అక్కడ ఆగిపోయారు.)

కన : (వెధవ నవ్వు నవ్వుతూ, వెనక్కి వచ్చి) ఏమిటోయ్ కృష్ణారావు! కులాసాయేనా? పలకరిద్దామనుకుంటే లోపల నిద్రపోతున్నావట. ఇంతసేపూ నీ గొప్పల గురించే చెబుతున్నారు మీ మావ.

కృ : ఆహా! అలాగా! మీరు కాసేపు ఆగితే, మా మావ గొప్పం

గురించి నేనూ చెబుతాను. మా మావ గొప్పల గురించే కాదు. మీ గొప్పల గురించీ చెబుతాను.

కన : మామీద నీకున్న గౌరవం అటువంటిది. చూశారా, పార్వతీశం గారూ! పెద్దవాళ్ళంటే మనవాడికి ఎంత భక్తో, ఎంత వినయమో! కృష్ణారావులాంటి అల్లుడు దొరికినందుకు రాజయ్య ఎంతయినా అదృష్టవంతుడే.

కృ : ఇందాక ఇక్కడేదో గొడవ జరుగుతుంది. ఏం గొడవ అండీ కనకయ్యగారూ!

కన : గొడవ అంటే....గొడవకాదు బాబు! తండ్రీ, కూతుళ్ళకి మధ్య చిన్న లిటిగేషన్,

కృ : తండ్రీ, కూతుళ్ళకా? కొడుకు, కోడలికా?

కన : (తత్తరపడి) కొ .... కొ....కొడుకు ఎవరు? కో....కో.... కోడలు ఎవరు? తగువు తండ్రీ కూతుళ్ళకే! అంటే మీ మావకి, మీ ఆవిడకి.

కృ : ఓహో, అలాగా! మీకు,మీ అమ్మాయికి తగువు ఎందుకొచ్చింది మావగారూ?

రాజ : పెద్ద తగువేమి కాదు అల్లుడు. పొద్దుట రాగానే నువ్వు స్కూటర్ కావాలని అడిగావు కదా?

కృ : అడిగాను.

రాజ : ప్రస్తుతానికి నా దగ్గర అంత డబ్బులేదు. తర్వాత కొంటానని నేను అన్నాను కదా!

కృ : అవును, అన్నారు.

రాజ : ఆ తర్వాత నువ్వు లోనికి వెళ్ళి పడుకున్నావు గానీ, మా అమ్మాయి మాత్రం నన్ను పట్టుకొని, "మా ఆయనకి స్కూటర్ కొంటావా? లేదా? ఎంచేత కొనియ్యవు? స్కూటర్ కొంటేనేగానీ, మా ఆయన నన్ను ఏలుకోడు? నా కాపురం

చెడిపోవదు. నీకిష్టమేనా?" అని ఆటంబాంబులు పేల్చింది అల్లుడూ!

కృ : కాపురం మీ అమ్మాయిది కదా! చెడిపోవడానికి మీరు ఇష్ట పడరు లెండి. చెప్పండి. ఆ తర్వాత?

రాజ : "నాకు నీ కాపురం ముఖ్యంగానీ, డబ్బు ముఖ్యం కాదు. అలాగే కొంటాను. ఊరుకో తల్లీ!" అన్నాను.

కృ : అయితే మొత్తానికి స్కూటర్ కొనివ్వడానికి నిశ్చయించు కున్నారన్నమాట. చాలా సంతోషం. కానీ, మావగారూ!నాదొక చిన్న సందేహం. ఇంతాక నేను అడిగినప్పుడు డబ్బులేదని తప్పించుకున్నారు కదా! మరి ఇప్పుడు ఇంత 'సడన్'గా అంత డబ్బు ఎలా వచ్చిందండీ మీకు?

రాజ : ఎలా వస్తాయి పరమేశ్వరా? అప్పుచేస్తే వస్తాయి. ఏ వస్తు వన్నా తాకట్టుపెడితే వస్తాయి. ఇంకా....

కృ : ఏ తగువులోనన్నా తప్పుడు సాక్ష్యం చెప్పినా వస్తాయి వచ్చగా వున్న కాపురాల్లో నిప్పులు పోసినా వస్తాయి. ఇంకా అలాంటి వెధవపనులు ఏం చేసినా వస్తాయి. ఏమంటారు?

పా : అవతల నాకు తాలూకాఆఫీసుకి వేళవుతుంది. నేను వెళ్ళొస్తాను రాజయ్యగారూ!

కన : నాకూ ఇంటిదగ్గర బోలెడు పనులున్నాయి. నేనూ వెళ్తున్నాను రాజయ్యా!

(ఇద్దరూ కలిసి మెల్లగా బయటికి జారుకోబోయారు.)

కృ : పెద్దలు .... పూజ్యులు....గౌరవనీయులు మీరు వెళ్ళిపోతే ఎలా అండీ! తగువు తీరిన తర్వాతే వెళ్దురుగానీ, కూర్చోండి.

(తప్పదన్నట్టు ఇద్దరూ బిక్కమొహాలు వేసుకుని అక్కడున్న కుర్చీల్లో చతికిలబడ్డారు.)

కృ : సత్యా! నువ్వు చెప్పు స్కూటర్ కొనడానికి అమాంతం అంత డబ్బు ఎక్కడనుండి వచ్చింది మీ నాన్నకి?

సత్య : పార్వతీశంగారు ఇస్తామన్నారు.

కృ : ఆయన ఇవ్వడం దేనికి?

సత్య : ఎందుకంటే యువరానర్! మా నాన్నగారు, కనకయ్యగారు కలిసి ఈ పార్వతీశంగారి కొడుకునీ....

రాజ : నా పరువు తియ్యకు తల్లీ!

కన : మా మర్యాద కాపాడు తల్లీ!

కృ : పరువు....మర్యాద! జీవితానికి ఎంత విలువైన మాటలు అంత బరువైన పదజాలం వాడుతున్నారంటే ఫ్లాష్‌బ్యాక్‌లో పెద్ద కథే వుందన్నమాట. చూడండీ, మీ పరువు దక్కాలంటే మీ ముగ్గురిలో ఎవరో ఒకరు ధైర్యంచేసి నిజం చెప్పెయ్యండి.

రాజ : ఇందులో చెప్పడానికి ఏముంది అల్లుడూ? నీకు స్కూటర్ కొనివ్వాలని నేను, కూతురి పెళ్ళిచెయ్యడానికి కనకయ్య పార్వతీశంగారిని అప్పు అడిగాము ఆయన ఇస్తామన్నారు.

కృ . మీ అవసరాలు కరెక్టేమోగానీ, అప్పుగా అడిగిన మాటమాత్రం అబద్ధం.

రాజ : నేను చెప్పింది నిజమే అల్లుడూ! నా మాటమీద నమ్మకం లేక పోతే పోనీ, పార్వతీశంగారినే అడుగు.

కృ : పాపం, ఆయనని ఇబ్బంది పెట్టడం ఎందుకు? మీరు చెప్పింది నిజమో, కాదో చెప్పడానికి లోపలనుండి ఒక నిజాలపెట్టె వస్తుంది. అంతవరకు కొంచెం ఓపిక పట్టండి.

ముగ్గురు: (ఒకరి మొహాలు ఒకరు చూసుకుని) నిజాలపెట్టా?

కృ : దాని మహిమ ఏమిటోకూడ మీకు చూపిస్తాను. అప్పుడు మీరు బడిగా ఆశ్చర్యపోదురు గాని. సోములూ! ఆ పెట్టె ఇలా తీసుకురా!

సోము : (మధ్యగదినుండి టేప్‌రికార్డర్ తీసుకువచ్చి) ఇదిగో బాబు!
(అని కృష్ణారావుకి అందించాడు)

కృ : సోములూ! ఆ స్టూలు తీసుకొచ్చి ఇక్కడ వెయ్యి.
(సోములు చేతులకుర్చీ పక్కనున్న స్టూలు తీసుకొచ్చి వేశాడు.)

కృ : (టేప్‌రికార్డర్ స్టూలుమీద నిలబెట్టి) మామగారూ! ఇదేమిటో తెలుసా?

రాజ : (వెంటనే) రేడియోపెట్టె.

కృ : (తల అడ్డంగా తిప్పి) కనకయ్యగారూ! మీరు చెప్పండి.

కన : (ఆలోచించి) ట్రాన్సిస్టర్!

కృ : ఊహు! పార్వతీశంగారు, మీరు చెప్పగలరేమో ఆలోచించండి.

పా : రేడియో కాక, ట్రాన్సిస్టర్ కాక ఏమయి వుంటుంది?

సత్య : (నవ్వుతూ) నాకు తెలుసు. నన్ను చెప్పమంటారా?

కృ : నీకు తెలుసు కనకే నిన్ను అడగలేదు. ఏమండీ మునసబుగారు! కరణంగారు, కామందుగారు జాగ్రత్తగా వినండి. దీనిని టేప్ రికార్డర్ అంటారు. ఇది ప్రాణం లేని వస్తువే అయినా దీనికి నోరు, చెవులు వున్నాయి. మీరు రహస్యంగా మాట్లాడుకున్న మాటల్ని ఇది దొంగచాటుగా వినేసి, జెల్లకొట్టినట్టు మీ మాటల్ని మళ్ళీ మీకే వినిపిస్తుంది. చూస్తారేమిటి దీని మహిమ. ఓం....గ్రీం....ఛూమంతర్! వినండి బాబు! వినండి. (అని టేప్ 'ఆన్' చేశాడు)

"అదేమిటి రాజయ్యా! అలా మాట్లాడతావు. మొన్న పూరిళ్ళు తగలడిపోయినప్పుడు వచ్చిన గ్రాంటులో అయిదువేలు మిగిలిస్తే నువ్వేకదా తీసుకున్నావు."

"మీ రెండో అమ్మాయిపెళ్ళి అని జెప్పి సారాకేసుల్లో వచ్చిన కమీషన్ డబ్బు పదివేలూ నువ్వు తీసుకోలేదా కనకయ్యా!"
(టేప్ 'ఆఫ్' చేశాడు)

ఆ, ఏమండీ పార్వతీశంగారూ! మీ కొడుకు,కోడలు సెపరేషన్ కేసు డైలాగ్స్‌కూడ ఇందులోనే వున్నాయి. ముచ్చటగా మీ మాటలుకూడ కొన్ని వినిపించమన్నారేమిటి?

పా : వద్దు బాబు, వద్దు. నీకు కావలసింది స్కూటరేకదా! నేను కొనిస్తాను బాబు. నన్ను వదిలిపెట్టు.

రాజ : నీకు స్కూటరేం కర్మ, కారే కొంటాను అల్లుడు.

కవ : ఏదో పెద్దమనుషుల్లా బ్రతుకుతున్నాం.మా పరువు తీసి వీధిలో పెట్టకు బాబు.

కృ : జైల్లో కూర్చునే వాళ్ళకి పరువు ఎందుకండీ!

ముగ్గురు: (ఒక్కసారే) అమ్మో జైలే.

కృ : (టేప్ రికార్డర్ తెరిచి 'కేసెట్' పైకితీసి) ఈ టేపురికార్డర్ చిలక అయితే, ఆ చిలక ప్రాణం ఈ టేప్ ఇది గాని పోలీసు వాళ్ళ చేతుల్లోకి వెళ్ళిందా....పద్నాలుగేళ్ళకి తక్కువ కాకుండ వేసేస్తారు జైలుశిక్ష.

కవ :
పా : | పద్నాలుగేళ్ళే.

రాజ : ఇంకెప్పుడూ అలాటి తప్పులు చెయ్యం. ఈసారికి మమ్మల్ని చెమించి వొగ్గీ అలుడూ!

కృ : మిమ్మల్ని అంత తేలికగా మాత్రం వదలను. సోములూ, ఈ టేప్‌రికార్డర్ లోపల పెట్టు. (సోములు స్టూలు యథాస్థానంలో పెట్టేసి, టేప్‌రికార్డర్ మధ్య గదిలోకి తీసుకొని వెళ్ళిపోయాడు) ఏమండీ మావగారూ! పార్వతీశంగారు మీకు పదివేలు ఎందుకు ఇస్తామన్నారో ఇప్పుడు చెప్పండి.

రాజ : అన్ని సంగతులు నీకు తెలిసిపోయాయి కదా! మళ్లీ నన్ను అడగడం ఎందుకు అల్లుడూ.

కృ : ఒకసారి మీ నోటితో చెబితే వినాలని ముచ్చటగా వుంది.

రాజ : చెప్పక తప్పదా అల్లుడు?

కృ : తప్పదు పరమేశ్వరా!

రాజ : అయితే విను, (ఇబ్బందిగా, ఎటో చూస్తూ) పార్వతీశంగారి కొడుకుని, కోడల్ని విడదీసినందుకు.

కృ : అందువలన మీకు వచ్చేది పదివేలు. అవునా?

రాజ : అవును.

కృ : ఆ పదివేలకోసం మీరొక అమ్మాయి కాపురం చెడగొట్టాలి అవునా?

రాజ : అవును. (తడబడి) కా....కా....కాదు అలుడూ.

: అంటే ఏమిటి? మీ అమ్మాయి బాగుకోసం మరో అమ్మాయి కాపురం చెడగొడతానంటారు. బావుంది. చాలా బావుందండీ! లోకంలో మీ అమ్మాయి మాత్రం సుఖపడితే చాలు. తక్కిన ఆడపిల్లలు ఏమైపోయినా మీకు ఫర్వాలేదు అంతేనా?

రాజ : లేదు అల్లుడూ, ఇకనుంచి అలాటి ఎదవపనులు చెయ్యను. నన్ను నమ్ము అల్లుడు.

కృ : మళ్ళీ ఎప్పుడన్నా అలాంటి పాడుపనులు చేస్తేనో!

రాజ : జెయిలు చేయించి అల్లుడూ.

కృ : ఏవండీ పార్వతీశంగారూ.... మీ కొడుకుని, కోడల్ని వేరు చెయ్యాలనే ఆలోచన మీకు ఎందుకొచ్చిందండీ?

పా : ఈ పెళ్ళి మా కులం వాళ్ళెవరికీ ఇష్టంలేదు.

కృ : చేసుకున్నది మీ అబ్బాయి అయితే, మధ్య వాళ్ళ ఇష్టం ఏమిటి?

పా : ఆ పిల్లది మా కులం కాదు, మన మతం కాదు.

కృ : అయితే ఏం? ఆ పిల్ల మాత్రం మనిషి కాదా?

పా : మాకు కావలసింది మా కులం మనిషి. కులంలేని పిల్లను కోడలిగా స్వీకరిస్తే మా కులం మమ్మల్ని వెలివేస్తుంది.

కృ : అలా అని ఈ పెళ్ళి చెడగొడితే చట్టం మిమ్మల్ని జైలుకి పంపిస్తుంది. అది తెలుసా మీకు?

పా : మా కులం కట్టుబాట్లు అటువంటివి. నన్నేం చెయ్యమన్నారు?

కృ : మరయితే ఈ పెళ్ళి చెడగొట్టి ఏం చెయ్యాలనుకుంటున్నారు?

పా : మావాడికి మళ్ళీ పెళ్ళి చేస్తాను.

కృ : మీ బావమరిది ఇచ్చే మూడులక్షల కట్నం కోసమేనా? (పార్వతీశం మౌనంగా తలదించుకోవడంచూసి) ఏవండీ మాట్లాడరేం? పోనీ, మీకు వున్న ఆస్తిమొత్తం ఎంత వుంటుందో చెప్పగలరా?

పా : సుమారు పాతికలక్షలు వుంటుంది.

కృ : అంత ఆస్తి వుంచుకుని ముష్టి మూడులక్షలకోసం కక్కుర్తి ఏమిటండీ? ఆ వెధవ ఆస్తికోసం మీ అబ్బాయి మనసు పడి పెళ్ళి చేసుకున్న అమ్మాయి మూడుముళ్ళు విడదీస్తారా? మీ స్వార్ధంకోసం మీ కొడుకు సుఖసంతోషాలనే బలి కోరు కుంటారా? ఇది చాలా దారుణం అండీ.

పా : నీ మాటకి ఇప్పుడు నేను ఔను అన్నా, అనక మా కులం కాదు అంటుంది.

కృ : ఈ రోజుల్లో ఇంకా కులాలు మతాలు ఏమిటండీ? ఒక్కసారి ఇలా వెలుగులోకి వెళ్ళండి మీ బ్రతుకులు ఎంత చీకటిగా వున్నాయో తెలుస్తుంది.

పా : కులాన్ని కెదురు తిరిగి బ్రతకడం ఈ పల్లెటూర్లో ఎంత కష్టమో నీకు తెలీదు బాబు.

కృ : ఎవరు ఎలా అనుకున్నా ఈ పెళ్ళి మీరు అంగీకరించకా తప్పదు, ఆ అమ్మాయిని మీ కోడలుగా స్వీకరించకా తప్పదు కాదంటే చెప్పండి. ఈ కేస్ పోలీసువాళ్ళ చేతుల్లోకి వెళుతుంది. మీకు పద్నాలుగేళ్ళ జైలుశిక్ష పడిపోతుంది.

పా : నువ్వు చెప్పినట్టే చేస్తానుగాని, ఆ జైలుశిక్షమాత్రం పడకుండ చూడు బాబు.

కృ : అలారండి దారికి. దెబ్బకి దెయ్యమైనా జడుస్తుందని అందుకే అన్నారు. ఆ, ఏమండీ లిటిగేషన్ కరణంగారూ .... పదివేల రూపాయలకోసం ఎలాంటి పాడుపనయినా చేస్తారన్నమాట.

కన : బుద్ధి పొరపాటయింది. పిల్లలు గలవాణ్ని. నన్ను క్షమించు బాబు.

కృ : పిల్లలు గలవాణ్ని అంటున్నారు. ఎంతమంది పిల్లలు వున్నారేమిటి మీకు.

కన : ఏడుగురు బాబు.

కృ : ఏడుగురే! ఆడపిల్లలు ఎంతమంది? మగపిల్లలు ఎంతమంది?

కన : ఉన్న ఏడుగురూ ఆడపిల్లలే, మగపిల్లలు లేరు బాబు.

కృ : 'ఫేమిలీ ప్లేనింగు' అన్నమాట ఎప్పుడైనా విన్నారేమిటి?

కన : విన్నాను బాబు.

కృ : దాని అర్థం తెలుసా మీకు?

కన : తెలీకేం? తెలుసు బాబు.

కృ : మరేం, ఎందుచేత అమలు జరపలేదు?

కన : ఒక్క మగపిల్లవాడయినా లేకుండా....

కృ : లేకపోతే ఏం? మగపిల్లవాడువుండి తీరాలన్నా రూలు ఏమన్నా వుందా?

కన : అదికాదు బాబు. నేను గడించిపెట్టిన ఆస్తంతా....

కృ : మీ ఏడుగురు కూతుళ్ళకి ఏడు వాటాలు ఇచ్చెయ్యండి.

కన : లేదు బాబు. నా ఆస్తి అంతా రేపు నాకు పుట్టబోయే కొడుకు కోసమే దాచివుంచాను.

కృ : ఎవరైనా వింటే నవ్వుతారు. ఈ వయసులో ఇంకా మీకు పిల్లలు ఏమిటండీ....పుట్టని ఆ మగపిల్లవాడి పేరుచెప్పి ఇంత మంది ఆడపిల్లల్ని దుఃఖపెడతారా? వాళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యడం కోసం మరో ఇంటి ఆడపిల్లల సంసారాలు కూల్చుస్తారా?

మీలాంటివాళ్ళని వూరికే వదిలేస్తే ఇంకా ఎంతమంది ఆతపిల్లల జీవితాలు అయినా నాశనం చేస్తారు. ఎన్ని ఘోరమైన పాపాలు అయినా చేస్తారు కాబట్టి మీరు వెంటనే ఒక పని చెయ్యండి.

కన : నువ్విప్పుడు ఏం చెయ్యమంటే అదే చేస్తాను. సెలవు ఇయ్యి బాబు.

కృ : వెంటనే పట్నం వెళ్ళి ఫేమిలీ ప్లేనింగు ఆపరేషన్ చేయించుకు రండి.

కన : ఆపరేషనా? ఆ పనిమాత్రం ఇప్పుడు నేను చెయ్యలేను. అది తప్పించి ఏమయినా అడుగు— చేస్తాను.

కృ : మీ ఆడపిల్లల శ్రేయస్సుకోసం, ఈ వూరిప్రజల బాగుకోసం, ముఖ్యంగా దేశక్షేమం కోసం— మీరు వెంటనే ఆపరేషన్ చేయించుకోవడం మంచిది.

కన : పెట్టగా పెట్టగా నాకు బలే లిటిగేషన్ పెట్టావయ్యా! తప్పుతుందా నాయనా! రేపే వెళ్ళి చేయించేసుకొంటాను.

(ఇప్పుడు కృష్ణారావు కుడివైపుకి సత్య, ఎడమవైపుకి కనకయ్య,రాజయ్య,పార్వతీశం వున్నారు. కృష్ణారావు కనకయ్యతో మాట్లాడుతుండగా, రాజయ్య మెల్లగా పార్వతీశం చేతికర్ర తీసుకుని కృష్ణారావు తలమీద బలంగా మోదాడు. ఆ దెబ్బకి 'అబ్బా!'అని మూలుగుతూ కృష్ణారావు నేలమీద పడిపోయాడు. అతని చేతిలోవున్న 'కేసెట్' వెళ్ళి సత్య కాళ్ళదగ్గర పడింది. రాజయ్య దానిని చేజిక్కించుకోవాలని అడుగు ముందుకి వేసే లోపల అది సత్య చేతిలోకి వెళ్ళిపోయింది.)

సత్య : (భయంతో వణుకుతూ) ఏమిటి నాన్నా ఈ అఘాయిత్యం?

రాజ : (నవ్వుతూ) ఏముందమ్మా నీ మొగుడు పాములా నన్ను కాటెయ్యాలని చూశాడు కోరలు పీకేసాను. అంతే!

కన : భేష్! బలే తెలివైన పని చేశావు రాజయ్యా!
(ఈ హడావిడికి మధ్యగదినుండి సోములు వచ్చి జరిగించి, జరుగుతున్నది గమనించి, మౌనంగా ఓమూల నిలుచున్నాడు)

సత్య : నువ్వు ఎవరిని కొట్టావో తెలుసా నాన్నా? నీ కూతురి మెడలో తాళి కట్టిన నీ సొంత అల్లుణ్ని.

రాజ : అల్లుడు కాబట్టే ఇంతటితో వదిలేసాను. అదే మరొకడూ, మరొకడూ అయితే ఈపాటికి సరాసరి ఆ వరమేస్పరుడికాడికి పంపించేసి వుండేవోణ్ని. అల్లుడట అల్లుడు.... సొంతఅల్లుడు సొంత మావకి చెయ్యాల్సిన పనేనా ఇది?

సత్య : ఏమిటి చేశారు నాన్నా! అవినీతికి అలవాటు పడిపోయిన మీ మనసుల్ని మంచి దారికి మళ్ళించాలనుకున్నాడు. చీకటిలాంటి మీ బ్రతుకుల్లో దీపం వెలిగించాలనుకున్నాడు

రాజ : వద్నా అగేల్లు జెయిల్లో పెట్టించేసా?

సత్య : మీరు చేసే ఇటువంటి అక్రమాలకి జైలు ఏమిటి నాన్నా! ఉరి కంబం ఎక్కించినా తప్పులేదు.

రాజ : నీ వాలకం జూస్తుంటే ఆడు, నువ్వు కలిసే ఈ పన్నాగం అంతా పన్నినట్టున్నారే!

సత్య : నీ అనుమానం నిజమే నాన్నా డబ్బుకోసం నువ్వు ఎలాంటి గడ్డి అయినా కరుస్తావని తెలిసే మేము ఈ నాటకం ఆడాము. తగువుకోసం ఈరోజు పార్వతీశంగారు మన ఇంటికి వస్తారన్న సంగతి సోములుద్వారా మాకు ముందే తెలిసింది. అందుకే మీ ముగ్గురూ చాలా తెలివి తక్కువగా పట్టుబడిపోయారు.

రాజ : ఈ సోములుగాడు నా ఉప్పు తిని నాకే ఎసరెట్టాడు పర మేస్పరా!

కన : రాజయ్యా! ఏ లిటిగేషన్లూ వుంచవు. ముందు మీ అమ్మాయి చేతిలోని చెక్ లాక్కో.

పా : మన ప్రాణాలన్నీ అందులోనే వున్నాయండీ రాజయ్యగారూ! మీ అల్లుడు లేస్తాడేమో! త్వరగా చేజిక్కించుకోండి.

రాజ : అమ్మా సత్తెమ్మా! మర్యాదగా ఆ చేప ఇచ్చెయ్యి లేకపోతే మీ నాన్నకి చాలా కోపమొస్తుంది.

సత్య : నువ్వు ఏం చేసినా సరే! ఆ చేపమాత్రం ఇవ్వను.

రాజ : ఇయ్యవూ? ఎలా ఇయ్యవో నేనూ చూస్తాను. పార్వతిసుంగోరు, కనకయ్యా.... చూస్తారేం? దాన్ని చెరో రెక్కా విరిచి పట్టుకోండి.

(ముగ్గురూ వికటాట్టహాసం చేస్తూ సత్యమీదికి వస్తున్నారు. అంతవరకు ఆ దృశ్యాన్ని మౌనంగా తిలకిస్తున్న సోములు గోడకి ఆన్చివున్న పొడవాటి కర్ర చేతిలోకి తీసుకుని, మెరుపులా సత్యకి అడ్డంగా వచ్చి నిలుచున్నాడు.)

సోము : ఆగండ్రా నాయాల! అమ్మాయిగోరి ఒంటిమీద వెయ్యిగాని వడిందో, మీ పేనాలు దక్కవు.

రాజ : పాలేరు ఎదవకి ఎంత దయిర్యం వొచ్చేసింది పరమేస్పరా!

సోము : మల్లీ ఈ సుట్టు పాలేరు, గీలేరు అని నోటికొచ్చినట్టు వాగితే, పల్లు రాల్తాయి. అమ్మాయిగోరూ! బాబుగారి ముకంమీద కాసిన్ని నీల్లు సల్లండి.

రాజ : గంగిగోవులా వుండేవోడు. ఇలా మారిపోనాడేటి పరమేస్పరా?

సోము : గంగిగోవు అయినా తోకట్టుకు నాగితే కొమ్ము ఇసురుతుంది బావు. నాను గంగిగోవుని కాను- మనిసిని.

(ఇంతలో సత్య కూజాలో నీళ్ళు చేతిలో పోసుకువచ్చి కృష్ణారావు ముఖంమీద చల్లింతో, అతనికి స్పృహ వచ్చింది.)

సత్య : నీవంటీ, ఎలా వుందండీ?

కృ : (చిన్నగా మూలుగుతూ) నాకేం ఫర్వాలేదు సత్యా! ఏదీ ఆ చేప ఇలా ఇవ్వు. (సత్య చేపు ఇప్పించి) ముల్లుని ముల్లు తోనే తియ్యాలిగాని, వెన్నతో రుద్దితే వస్తుందా? ఇలాంటి వాళ్ళకి మాటలతో బుద్ధి చెప్పాలనుకోవడం నాదె పొరపాటు. ఈ టేప్ తీసుకువెళ్ళి పోలీసువాళ్ళకి ఇస్తే సరిపోతుంది. అన్ని వ్యవహారాలు వాళ్ళే చూసుకుంటారు. మధ్యలో నాకెందుకు శ్రమ.

రాజ : అంతపని మాత్రం చెయ్యకు అల్లుడూ! నా తొందరపాటుని మన్నించు.

కృ : మీలాంటి వాళ్ళని క్షమించి వదిలేస్తే దేశానికి చాలా నష్టాలు వస్తాయి. అందుచేత మీ ముగ్గుర్నీ తీసుకువెళ్ళి జైల్లో కూర్చో బెట్టడమే అన్ని విధాల మంచిదనిపిస్తుంది.

(చేతిలో వున్న 'కేసెట్'తో గుమ్మంవైపు కదిలిన కృష్ణా రావుని రాజయ్య, కనకయ్య, పార్వతీశం చుట్టుముట్టేసి ఒకరి తర్వాత ఒకరు అతని కాళ్ళమీద పడ్డారు)

కన : బాబు, నీ కాళ్ళు పట్టుకుంటాను. పిల్లలు గలవాడిని. కాస్త కనికరం చూపించు తండ్రీ!

రాజ : నా అమ్మాయి ముఖం చూసి అయినా నన్ను క్షమించు అల్లుడు.

పా : నువ్వు ఏ శిక్ష అయినా విధించుగానీ, జైలుశిక్ష మాత్రం తప్పించు బాబు.

కృ : (కొంచెం వెనక్కి తీసుకుని) ముందు మీరు పైకి లేవండి. ఊ. (ముగ్గురూ పైకి లేచాక) నేను పెట్టే కొన్ని షరతులకి మీరు కట్టుబడి వుంటామని మాట ఇస్తే మీకు జైలుశిక్ష తప్పుతుంది.

రాజ : అలాగే వుంటాం. వేగి చెప్పు అల్లుడూ!

పా : నువ్వు ఎం చెయ్యమంటే అదే చేస్తాం.

కన : ఎలా చెబితే అలాగే వినుకుంటాం.

కృ : ఎవండీ కనకయ్యగారూ, ఇందాక మీకు ఏం చెప్పానో గుర్తుందా?

కన : ఉంది బాబు. పట్నం వెళ్ళి ఆపరేషన్ చేయించుకోవాలి.

కృ : మరి ఎప్పుడు వెళ్ళి చేయించుకుంటారు?

కన : ఎప్పుడో ఎందుకు బాబు. రేపు వుదయమే వెళ్ళి చేయించుకుంటాను. రేపు శ్రావణ శుక్రవారం. మంచిరోజు కూడాను.

కృ : అంతేకాదు. మీ ఆస్తి మొత్తం ఏడుభాగాలు చేసి, మీ ఏడుగురు కూతుళ్ళకీ సమంగా పంచి ఇవ్వాలి.

కన : ఈ షరతుకి మాత్రం నేను ఒప్పుకోను.

కృ : అయితే పద్నాలుగేళ్ళు జైల్లో కూర్చోవడానికి ఒప్పుకోండి.

కన : ఇదెక్కడి లిటిగేషనయ్యా బాబు. అలాగే నాయనా. తప్పుతుందా? నువ్వు చెప్పినట్టే నా ఆస్తంతా నా ఏడుగురు కూతుళ్ళకి పంచేస్తాను సరేనా?

కృ : పార్వతీశంగారూ, మీరు చెయ్యాల్సిన పనేమిటో తెలుసా?

పా : ఆజ్ఞాపించండి బాబు.

కృ : మీ కొడుకు చేసుకున్న ఆ అమ్మాయిని కోడలిగా స్వీకరించాలి. వాళ్ళిద్దర్నీ వేరు చెయ్యాలనే ప్రయత్నంగానీ, మళ్ళీ తల పెట్టారా? (చేతిలో టేప్ చూపిస్తూ) అరెస్టు వారెంటు వస్తుంది మీ ఇంటికి జాగ్రత్త!

పా : ఇంకెప్పుడూ అలాంటి బుద్ధి తక్కువ పనులు చెయ్యను బాబు.

ఆ అమ్మాయిని నా స్వొంత కూతురికన్నా ఎక్కువగా చూసు కుంటాను.

కృ : గుడ్! అలా అన్నారు బావుంది, ఏంవండీ మాంవగారూ! ఈ రోజునుండి మీరు, ఈ కనకయ్య లిటిగేషన్ వ్యవహారాలన్నీ మానెయ్యాలి. ఇకమీదట మీ మూలంగా ఈ వూళ్లో ఎవరికీ ఎలాంటి కీడు జరిగినా మిమ్మల్ని మాత్రం క్షమించను. ఒకటి కాదు, రెండుకాదు– పధ్నాలుగేళ్ళు. ఏమిటనుకున్నారు?

రాజ : జెయిలా సిచ్చ!

కృ : జైలుశిక్ష మాట ఎలావున్నా పరమేస్వరా! మీ అమ్మాయికి విడాకులు ఇచ్చెయ్యడం మాత్రం ఖాయం.

రాజ : అలాటి ఎదవపనులు మల్లీ చెయ్యడమే! (లెంపలు వేసుకుని) బుద్దొచ్చింది పరమేస్వరా!

(కృష్ణారావు సత్య చెవిలో మెల్లగా ఏదో చెప్పాడు. ఆ మాటకి సత్య ఫకాలున నవ్వింది.)

కృ : ఏవండీ, మునసబుగారు, కరణంగారు, కామందుగారు ఇప్పుడు మీ ముగ్గురు కలసి చెయ్యాల్సిన మంచిపని ఒకటి మిగిలి పోయింది.

రాజ : అది కూడ బేగి చెప్పిసీ అల్లుడూ!

కృ : మీరు ఎప్పుడన్నా గాంధీగారి మూడుకోతుల సూక్తి గురించి విన్నారా?.

ముగ్గురు: వినలేదే!

కృ : అయితే ఆసూక్తి ఏమిటో నేను చెబుతాను వినండి.(రాజయ్యని ఒక కుర్చీమీద కూర్చోబెట్టి) మావగారు, ముందు మీరు చెప్పండి. చెడు చెప్పకు.

రాజ : చెడు చెప్పకు.

కృ : (కనకయ్యని మరో కుర్చీమీద కూర్చోబెట్టి) కనకయ్యగారూ, మీరు చెప్పండి. చెడు వినకు.

కన : చెడు వినకు

కృ : (పార్వతీశాన్ని మూడవ కుర్చీ మీద కూర్చోబెట్టి) పార్వతీశం గారూ, మీరు చెప్పండి. చెడు చూడకు

పార్వ : చెడు చూడకు.

(ముగ్గురు మూడు కోతుల భంగిమల్లో వరసగా కుర్చీల మీద కూర్చున్నారు.)

కృ : ఇప్పుడు ముగ్గురు కలిసి అనండి. చెడు చెప్పకు.

ముగ్గురు: (ఒక్కసారే) చెడు చెప్పకు.

కృ : చెడు వినకు.

ముగ్గురు: (ఒక్కసారే) చెడు వినకు.

కృ : చెడు చూడకు.

ముగ్గురు: (ఒక్కసారే) చెడు చూడకు.

కృ : ఏది, మళ్ళీ ఒక్కసారి అనండి.

ముగ్గురు: చెడు చెప్పకు.... చెడు వినకు.... చెడు చూడకు........

(కృష్ణారావు, సత్య విజయోత్సాహంతో చెయ్యి చెయ్యి కలుపు కొని, హాయిగా నవ్వుకున్నారు. ఆమూడు కోతుల్ని వింతగా చూస్తున్న సోములు పొట్ట చెక్కలయ్యేలా నవ్వుతుండగా-తెర వాలింది)

.... స మా ప్తం ....